శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమునకు
గ్రంథకర్త సమర్పితము-

ఓం

సటీక

(లింగిబ్రాహ్మణ)

# వీరశైవవివాహవిధిః

## श्री वीरशैव विवाहविधिः

చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే

ఆంధ్రటిప్పణము వ్రాయబడి;

రావికోటి వీరయ్యగారిచే

ప్రకటింపబడెను.

బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ప్రెస్, (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపబడెను.

౧౯౨౪



[వెల ఒక రూపాయి.

# ఉపోద్ఘాతము

వీరశైవ వైదికశిరోమణులారా,

జగదీశ్వరానుగ్రహ నిర్మితమగు నీజగతిని విశేషమతములాయా ఆచార్యులచే స్థాపించబడినవను విషయమందరకును విదితమే యైనను ప్రస్తుతము వీరశైవ (లింగిబ్రాహ్మణ) మతస్థాపనాది సౌకర్యములు పాశ్చిమికులుదప్ప ప్రాగ్జనపదులంతగా నెరింగిన వారలుండరనియె నా తలంపు. కొన్నిభాష్యాది గ్రంథములాంధ్రదేశమందే గలవు దానం జేసి ఆంధ్రదేశీయ వీరశైవులాకొంత తరి స్వమత ప్రాచీన శ్రేష్ఠత్వమును స్వీయమనమునందే వర్ణించుచున్నారుగాని శాస్త్రజ్ఞతచే పరమతీయుల దుర్వాదమునకు సదుత్తరదాతృవులు గాకయున్నారని ప్రత్యేకముగా వచింపనవసరము. ఈలోపమును బాపిద్రోలిన కర్ణాటక వీరశైవమహాశయులు ప్రాచీనమతగ్రంథ ప్రకటన మూలమున వీరశైవ మతమున కుపకార మొనర్చి యపారమగుకీర్తిని సంపాదించిరని తెల్పుట కెంతయో సంతసించుచున్నాడ. "చేదబావి జలసమృద్ధిని గ్రామసింహమానంద మొందినట్లు" పరదేశీయుల సుధారత నీక్షించిన నస్మత్సుఖ లభ్యమేమియును లేదుగదా. తత్కారణమున యథాశక్తి మతగ్రంథప్రసరణ మాంధ్రదేశమున గావించ నెంచియున్న నన్ను చిరకాలముచేనే తత్ప్రియాత్మాతురులగు బ్రహ్మశ్రీ మక్తల్ బసవలింగసుధీగారును హైదరాబాదు శ్రీమహంతు మఠము చన్నబసవబుధులును ఇవ్విషయమున నెక్కుడు శ్రద్ధగావచించుచుండెడివారు తన్మధ్యమున దశవర్షములనుండి వివాహాది కర్మల శుద్ధప్రతులకై గాచియున్న వేదమూర్తి రావికోటి మఠము వీరయ్యా గారలకు వత్సరత్రయము క్రింద మైసూరు శుద్ధ వివాహప్రతి యొకటి శ్రీ॥ బసవలింగార్యుల మూలముననే కరగతమగుటచే నానందహృదయులై తత్క్షణమున మూలమును మాతృమతిశీఘ్రమున నాంధ్రాక్షరములతో వ్రాసియా గ్రంథమును నాకడ బంపి కర్ణాటక భాషానుసారమున నీపొత్తమునకు ఆంధ్రటిప్పణము వ్రాయుడని యాజ్ఞాపించిరి. తత్సచ్ఛాసనమునకే సం

తుష్టుడనై మద్గురు సన్నిధానమున (నారాయణపేట బొమ్మలమఠమున) యథామతి తెలుగు టిప్పణము కొన్ని మాసములలో సమాప్తించి తద్గ్రంథమును వే॥ బసవలింగార్యుల సన్నిధికందింపగల్గితి. వారపారముగుదయచే బరిశోధించిరిగాని స్వదేహముయొక్క అనారోగ్యతవలన నాగ్రంథమును రా॥ వీరయ్యగారలకందింపజాలరైరి. ఏతత్సంవత్సరమున స్వదేశాగతుడనగు నన్నుగాంచి వీరయ్యగారు నీగ్రంథమును గురించియే నెక్కువగప్రశ్నించి ముద్రణ సహాయమొనర్చెదననియు మరల గ్రంథమునుపూర్తిగావించుడనియు యాజ్ఞాపించి స్వగ్రామమున కేగిరి. పిదపవల్లెయుని గ్రంథరచనాప్రారంభ మొనర్చి పత్రాష్టకము లిఖించునంతలో (మైలవరమున) మత్సహోదరి విగతప్రాణయయ్యెను మహాశయులారా "శ్రేయాంసి బహువిఘ్నాని" యనువాక్యానుభవమింతటితో సిద్ధించెనుగదా. ఈగ్రంథమున కంతరాయమిది యొండనియే తలంపవలదు. ఎన్నియోగలవు. వానినిట బొందుపరచిన గ్రంథవిస్తరమేగాక కార్యధురంధరత్వమును వెల్లడించిన దోషమునకు బాత్రుడ నగుదుననుభీతిచే విరమించితి. తదనంతరము మాసద్వయాలస్యమున మరల నీపొత్తమును లిఖించ నుద్యమించి యత్యల్పకాలమున సమాప్తించ గలిగితిని. కామికాది వాతులాంతాగమములలో నొకటగుఅంశమదాగమమందుక్తమగు నీవీరశైవ వివాహవిధిని మైసూరు వీరశైవ సమాజాభిమానులు తమదేశీయభాషలో ముద్రించియుండిరి. కాని ఎతద్గ్రంథోపకారము మనయాంధ్రదేశీయుల కొనర్చుట యత్యవసరమని తెలుగు టిప్పణమును వ్రాయుటయేగాక మహాసంకల్పము, సూర్యాసూక్తము అనుదానమంత్రములు, మాంగళిక శ్లోకములు నాయాక్రియలలో బొందుపరచితి. మరియు గ్రంథాదిని పౌరోహితులకతిసులభముగావిషయగ్రాహ్యమగుటకు ప్రధానవిషయములను చివర ఆశీర్వచన మంత్రములను జేర్చి మూలగ్రంథమునకన్నను సర్వాంగరమణీయముగ వ్రాసితి ననియే నాతలంపు. ఇవ్విషయమును పాఠకమహాశయులూహించక యుండరు. ఏతద్గ్రంథప్రయత్నమున బ్రోత్సహించి స్వమత ప్రేమాప్రదర్శన మూలమున ధన్యులైనట్టి వే॥ మక్తల్ బసవ

లింగార్యులకును హైదరాబాదు వే॥ మహంతుమఠీయ చన్న బసవార్యుల కును నాకృతజ్ఞతాభివందనములు సూచించెద. ఈ గ్రంథముద్రణాది వ్రయములకు పరిపూర్ణమగు సహాయమొనర్చి మతాభిమానమును వెల్లడించిన చందుపట్ల వీరయ్యగారలకు నాయభివందనము లర్పించెద. ఇందుగలదోషములను పండిత మహాశయు లెరింగించిన శిరసా స్వీక రించి పునర్ముద్రణమున సవరించెదనని ప్రార్థించుచు నుపోద్ఘాతమును విరమించెద.

ఇట్లు,

శా॥౧౮ రక్తాక్షి౹ధన జ్యేష్ఠశు॥౫ బుధవారము, నల్లగొండ.

బుధజనవిధేయుడు,
చిదిరెమఠం వీరభద్రశర్మ.

ఆర్యులారా! ఆంధ్రదేశీయులగు మనవీరశైవుల కత్యంతోప యుక్తమని దలచి వే॥ చిదిరేమఠము వీరభద్రశర్మగారిచే తెలుగు టిప్పణమును వ్రాసి సుధారించబడిన నీగ్రంథమును ముద్రణజేయించి తిని. వైదికశిఖామణులును ఇతరదాతృవులును సరియైన వెలకీ గ్రంథ మునుదీసికొని సహాయమొనర్చిన ఇటులే ప్రతిసంవత్సరమొక్కొక గ్రంథముచొప్పున మనవీరశైవమతదశకర్మలను ఇతరగృహప్రవేశాది విధులను పైవారిచే తెలుగుటిప్పణాదులను వ్రాయించి ముద్రణజేయిం చి మహాశయులగు తమహస్తమునకందింప గలుగుదునని విన్నవించు చున్నాడ. ☞ సూచన ఈగ్రంథము ఆంగ్ల దేశమందు రిజష్టరుచేయబడినది గనుక ఆంగ్లనైజాం ఇలాకా వారెవ్వరును మాయను జ్ఞలేక దీనిని ముద్రించిన దావాకు బాతులగుదురు.

ఇట్లు
రావికోటి మఠంవీరయ్య,
చందుపట్ల పోస్టు భువనగిరితాలూక (నైజాం)

# శుద్ధపత్రిక

పాఠకులీ పత్రికా ప్రకారము మొదలు తప్పులను దిద్దికొని పిదప చదువుదురని ప్రార్థన.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩ | ౨౬ | మాహేశ్వరును | మహేశ్వరులు |
| ,, | ౨౯ | తపుకునంశం | తబుకునందు |
| ౪ | ౨౫ | కర్మలందీరి | కర్మలందీర్చి |
| ౯ | ౫ | గర్తనదం | గర్తసదం |
| ౭ | ౨౧ | ఇతిపుజో | ఇతిపుంజో |
| ౧౩ | ౨౧ | పూవజ్వత్ | పూర్వ్వవత్ |
| ౧౯ | ౨౭ | యొక్కభాగము | యొక్కసమస్తభాగము |
| ౨౨ | ౧౦ | సుగన్నపంథా | సుగన్నఃపంథా |
| ౨౪ | ౨౨ | ఇద్రిఈశా | ఇంద్రిఈశా |
| ,, | ౨౭ | పూర్ణభాగ | పూర్వభాగ |
| ౩౧ | ౨౮ | పూజేను | పూజను |
| ౩౨ | ౧౯ | తిష్టంతు | తిష్ఠంతు |
| ,, | ౨౩ | ఆస్త్రాయ | అస్త్రాయ |
| ,, | ౨౬ | తిష్టంతు | తిష్ఠంతు |
| ౩౪ | ౨౦ | ,, | ,, |
| ౩౬ | ౧౫ | ,, | ,, |
| ,, | ౨౭ | మాహేశ్వరునకు | మాహేశ్వరులకు |
| ౩౭ | ౨౭ | భవత | భవంతు |
| ౪౭ | ౨౪ | వ్యాప్తేజో | వ్యాప్తేజో |
| ,, | ౨౯ | పాతాళాక్య | పాతాళాఖ్య |
| ౫౦ | ౨౬ | కనాట | కర్ణాట |
| ౫౭ | ౩౦ | పేయవలయు | వేయావలయు |
| ౬౨ | ౨౪ | ఊజిక | ఊజేక |
| ౬౪ | ౨౪ | పాంను | పాలంను |
| ౬౫ | ౧౦ | ష్టదళపద్మ | అష్టదళపద్మ |
| ౬౬ | ౨౪ | మధమందు | మధ్యమందు |
| ౬౮ | ౧ | ఆభిర్గిభి | ఆభిర్గిర్భి |
| ౯౮ | ౮ | భవభవతి | భవతిభవతి |



# విషయానుక్రమణిక



# గ్రంథప్రకాశకుల సంక్షిప్తవంశ సంచయము.

శా॥ శ్రీగౌరీహృదయాబ్జషట్పదకృపన్ ◆ శ్రీలన్ రహింగాంచుచున్
రాగంబొప్ప గిరీశ తత్పురుషస◆ద్రాజీవముఖంబునన్
భోగంబందజనించి దుష్టమతముల్ ◆ బోనాడి తా రేవణుం
డై గోత్రంబున కీర్తినందె మహదా ◆ నందాతిస్వాంతంబునన్.

ఉ॥ ఉండురెగాక నాత్మకను ◆ లోద్భవు లెవ్వరులేమిదోచఁగా
మెండగు లగ్నసత్క్రియల ◆ మేలుఁగవొంది ధరాతలంబునన్
దండిగ సంతతీంద్రులను ◆ గాంగని జాతక్రియాదికర్మలన్
నుండిత నాచరించి బుధ◆మండలి మెచ్చ శివైక్యమొందగా.

కం॥ ఆ రేవణ సుతు లతరి। చారుగుణాన్వితులుగాన ◆ శాస్త్రతతులలో
సారముల నెరిగి జగతిని। సూరులగుచు బగుల నెల్ల ◆ సూచించిరిగా.

సీ॥ వారిశిష్యపరంపర ◆ వర్తదగుచు। పాడవడి శ్రోత్రియబగియందు ◆ బొలుపుమీర
చందుపట్ల బుధాబ్ధికి ◆ చంద్రుడనగ। నుదయమొందెను సూరందు దుత్తముండు.

కం॥ ఆసుగుణుపత్ని కుక్షిని। రాసుతుచందమువగల్గె ◆ రాజార్యుడనన్
భానురమాహేశ్వరతతి। ఆసీవిషభూషసదృశుం◆డనగ జగతిలోన్.

చ॥ పరపవచాత్మశోభితుడు ◆ సజ్జనసంఘనతుండునయ్యు యీ
ధర నుతికెక్కు రాజయ సు◆ధాంశుడు ప్రీతిని రాజమాంబచే
గరిమను బెండ్లియాడి రతి◆కాముల మాడ్కి నిరంతరంబునన్
పరమసుఖార్ణమగ్నతను ◆ భాసురవృత్తి చరించుచుండగాన్.

సీ॥ ఎవ్వడు జగతిని ◆ నిందుధరుండని। పలుకుదురాతని ◆ పాదకృపను
యెవ్వని రాజరా◆జందురో నాతని। యణిమాది షట్పత్ప◆భాబి చేత
నెవ్వనిచే దక్ష◆యజ్ఞము ధ్వంసంబు। గావింపఁబడె వాని◆గరిమచేత
యెవ్వనికై యింద్రుఁ ◆ డెలమిగాచుచునుండు। నాతని సద్బుద్ధి ◆ అతిశయమున

గీ॥ జననమందెను చెలువంపు ◆ చందుపట్ల। పురిని సజ్జనశ్రేణులు ◆ బొలుపుమీర
సంస్తుతులుసేయ రాజాఖ్య◆ సత్కుమారు।డనగ వీరార్య నామధే◆యాన్వితుండు.

మ॥ సుగుణాధిక్యముచే సుసంపదలచే ◆ సొంపారు గాత్రంబుచే
నగజావల్లభ పాదకంజభజనన్ ◆ యానంద చిత్తుండునై
తగ వేదాధ్యయనాది వైదికములన్ ◆ ధన్యుండు వీరుండు మే
లుగ కల్యాణమనంబునన్ ధరణిలో ◆ లోలాక్షి లోలుండునై.

కం॥ సులలితముగ లలితాంబను। లలితాగుణ రూపభావ ♦ లావణ్యములన్
బోలంపొరుకాంత నత్తరి। బలు వైభవమునను వేగ ♦ బరిణయ మాడెన్.

గీ॥ పరిణయంబైన పిదప తా ♦ భాసురముగ। గరమ కాంతారతిని రతి ♦ కారణమున
ధరను యడవీంద్రు డను పేర ♦ దనరునట్టి। బరగనొక సుతరత్నముఁ బడసెనొక్కఁ.

కం॥ ఈసుగుణ సంచయాత్ముడు। దాసులనర్థులను బంధు ♦ తతి ననిశంబున్
వేసరక నేకబుద్ధిని। భూషించియు తా సుఖాబ్ధి ♦ బొందుచునుండెన్.

గీ॥ వీరయాఖ్యుండు ముదమున ♦ వీరశైవ। జనుల కుపకార మొనరించ ♦ జగతిలోన
నొక్కగ్రంథంబు ముద్రించి ♦ యొందుపుణ్య। మందవలెనని మనసున ♦ నాశజేసి.

గీ॥ వృషభ గోత్రాన్వితుండయ్యు ♦ వృద్ధినున్న। క్యాసనూర్ గంగాధర ♦ ఘనగురుండు
జేయు ముపకృతిజనులకు ♦ జెలువమున। నచ్చునొత్తించె నీగ్రంథ ♦ మాంధ్రమునను.

కం॥ ఏతద్గ్రంథము ముద్రణ। పాతము లేకుండునట్లు ♦ పరిశీలతగా
జేతువు రోగ్యాడవనగను। ప్రీతిని దిద్దితిని గిరిశ ♦ పేర్మిమోద్భవమై.

ఇట్లు,

బాలకవి చిదిరేమఠం వీరభద్రశర్మ.

శ్రీ గురూమాపతయే నమః

పౌరోహితులు తప్పక గమనించదగిన

# ప్రధాన విషయములు

పంచోపచారములు = గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు.

అష్టోపచారములు = గంధ, అక్షత, పుష్ప, వస్త్ర, ధూప, దీప, నైవేద్య, తాంబూలములు.

షోడశోపచారములు = ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, స్నాన, వస్త్ర, (ఉపవీతము అనగా ఉత్తరీయము) గంధ, అక్షత, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూల, ప్రదక్షిణ, నమస్కారములు.

పాద్యము = తెల్లఆవాలు, కుంకుమపువ్వు, గరక, చెంగల్వకోష్టు, వట్టివేరు, పచ్చకర్పూరము వీనినిదంచి ఆచూర్ణమును ఉదకమందు కలిపిన నిదియే పాద్యము.

అర్ఘ్యము = దర్భ, తెల్లఆవాలు, నువ్వులు, యవలు, వడ్లు, వీనిచూర్ణమును జలమునందు మిశ్రమొనర్చి, దీనియందు పాలనుగలిపిన నిదియె అర్ఘ్యజలము.

ఆచమనీయము = జాజికాయ, కచ్చూరములు, పచ్చకర్పూరము, చెంగల్వకోష్టు, కుంకుమపువ్వు, ఏలకులు, వీనిచూర్ణముచే మిశ్రించినదే ఆచమనీయజలము.

మధుపర్కము = పాలు, పెరుగు, నెయ్యి, తేనె, వీని నొక్క పాత్రలో బోసిన మధుపర్కమగును.

పంచామృతము = గోవుయొక్క పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెర వీనికూటమియే పంచామృతము.

పంచగవ్యములు = యెఱ్ఱని ఆవుపాలు, తెల్లని గోవు పెరుగు, పసుపుపచ్చని ఆవునెయ్యి, నల్లని గోవుపేడ, మూత్రము ఇవియే పంచగవ్యములు.

పంచపల్లవములు = రావి, చింత, మేడి, అలనేరేడు, మామిడి, వీనియాకులే పల్లవములు.

అష్టగంధము = చందనము, అగరు, పచ్చకర్పూరము, పొన్నపువ్వు, లవంగపత్రి, కుంకుమపువ్వు, వట్టివేళ్ళు, చెంగల్వకోష్టు ఇవియే సుగంధద్రవ్యములు.

ఆచమనమొనర్చు క్రమము = ఉద్ధరణిచే కుడిచేతిలో గోధుమగింజ మునుగునన్ని నీళ్ళను బోసికొని ఆనీటిని నాలుకతో స్పృశించి హస్తములు కడగికొనదగు.

ప్రాణాయామక్రమము = తర్జని (చూపుడువ్రేలు) మధ్యమ, ఈరెంటిని విడచి అంగుష్ఠ (పెద్దవ్రేలు) అనామిక (పవిత్రపువ్రేలు) కనిష్ఠ (చిటికెనవ్రేలు) ఈమూడువ్రేళ్ళచే ముక్కునుబట్టుకొని ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ఓమాపోజ్యోతిరసోమృతంబ్రహ్మ భూర్భువస్సువరోం॥ అనుమంత్రిమును మెల్లన జపముచు, చంద్రస్వరమగు ఎడమముక్కుచే వాయువును పూరించి (పీలిచి) రెండుముక్కులనుమూసి కుంభించి (వాయువును వెళ్ళకుండునటుల నిలిపి) సూర్యస్వరమైన కుడిముక్కునుండి రేచించవలయు (గాలిని విడువవలయు). ఇదియె ఒక ప్రాణాయామము. ఈ ప్రాణా

యామము నెంత యెక్కువగా జేసిన అంత శ్రేష్ఠమేకాని ఒక నిమిషమైనను జేయవలయు, ఇది అగువరకును ఓం భూః అను పైమంత్రము మనస్సం దనుచుండవలయు.

దర్భకూర్చము = తొమ్మిది దర్భలచే జేయవలయును. ఇది ౧౭ అంగుళముల పొడవుండవలయు. మొదళ్ళనుంచి ౧౨ అంగుళములు విడిచి ౧ ఒక అంగుళము వెడల్పు ముడినివేసి చివరకు నాల్గంగుళములు ఖాలీగా నుంచదగును. ఈ దర్భకట్టచేతనె పాద్యమును అర్ఘ్యజలమును ముట్టించి దీనిచేతనే శుద్ధజలమును పూజించెడు దేవునిప్రోక్షించదగును. మరియు సమస్తపూజాద్రవ్యములపై నీటిని ప్రోక్షించవలయు.

దర్భపవిత్రము = రెండు దర్భలచే అనామికపు వేలినకు రెండు చుట్లుజుట్టి ఒక అంగుళము వెడల్పు ముడివేసి నాల్గంగుళముల పొడవుకొనలుంచుట యోగ్యము. ఈ పవిత్రమును పురోహితుడు సమస్తకర్మలయందు ధరించుట శుభము.

ముద్రాలక్షణము = ముద్రలనరయనివారిచే జేయబడిన కర్మఫలము సిద్ధించదు. కావున మంత్రసిద్ధికై ఈక్రింద నుదహరించు ముద్రలు పూజాసమయ మందాచరించదగు.

ఆవాహినీముద్ర = రెండు చేతులను దోసిలిగాపట్టుకొని అనామిక వ్రేళ్ళక్రింది కాటునందు పెద్దనవేళ్ళ చివరలనుంచిన ఆవాహినీముద్రయగును.

స్థాపినీముద్ర = ఈపైజేసిన చేతులను బోర్లగాబట్టిన స్థాపినీ ముద్రయగును.

సన్నిధాపినీముద్ర = రెండు హస్తముల పెద్దవ్రేళ్ళను మీదికి నిలిపి వేర్వేరుగా ముష్ఠలను (పిడికిళ్లను) బట్టినదియె సన్నిధాపినీ ముద్రయనంబరగు.

సంరోధినీ = పెద్దనవేళ్ళను ముష్ఠియందుంచి వేర్వేరుగా బట్టునది సంరోధినీముద్ర.

సమ్ముఖీకరణముద్ర = పైపిడికిళ్లను వెల్లెలుకగాబట్టిన సమ్ముఖీకరణ ముద్రయనబరగు.

అవకుంఠినీముద్ర = కుడిచెయ్యిని ముష్ఠిగాబట్టి బోర్లగాజేసి తర్జనీవ్రేలును చాచి వెల్లవెలుకగా నుంచబడిన యెడమహస్తమందు ముట్టించి త్రిప్పిన అవకుంఠినీముద్ర యగును (ఇవియే షణ్ముద్రలు దేవతాపూజయందనేకస్థలములలో షణ్ముద్రాః ప్రదర్శ్య, అని వ్రాసియుండును, అనట - ఆవాహయామి ఆవాహితోభవ - అని - ఆవాహినీముద్రను, స్థాపయామి స్థాపితోభవ అని, స్థాపినీ ముద్రను, సన్నిధాపితోభవయని - సన్నిధాపినీముద్రను, సంరోధితోభవయని సంరోధినీముద్రను సమ్ముఖీకరణోభవయని సమ్ముఖీకరణముద్రను అవకుంఠితోభవయని అవకుంఠినీముద్రను పైప్రకారముజేసి చూపించిన ఇదియే షణ్ముద్రాప్రదర్శనమగును.

వరముద్ర రెండుహస్తముల దోసిలిగాచాపి వరదోభవయని చూపుటేవరముద్ర.

మహాముద్ర = రెండుకరములయొక్క పెద్దవ్రేళ్ళను, ఒకదానికొకటి దగిలించిపట్టి తక్కినవ్రేళ్ళను చాపి మహాంతోభవయని జూపిననిదియే మహాముద్ర (అష్టముద్రలు)

నమస్కారముద్ర = రెండుచేతులను జోడించి, వ్రేళ్ళను మీదికిజేసి హృదయప్రదేశమందు బెట్టుకొని నమితోభవయని చేసిన నమస్కారముద్ర యనబడును.

జ్ఞానముద్ర కుడిచేతియొక్క పెద్దన్రవేలును చూపుడున్రవేలును చేర్చి పట్టుకొని తక్కిన వాటిని చక్కగాచాపి జ్ఞానీభవయనిచూపిన జ్ఞానముద్ర (ఇదియేతత్త్వముద్ర)
కురంగముద్ర = పెద్దన్రవేలు తుదియందు మధ్యమానామిక వ్రేళ్ళుంచిన నిదియే కురంగ ముద్ర యనబడును, (దీనినేకొందరు ధేనుముద్రయందురు) ఇవి ఏకాదశముద్రలు. విధియందు షణ్ముద్రాః అన్నచోట ఆరుముద్రలను అష్టముద్రాః అన్నస్థలమున ఎనిమిదిముద్రలను, దశముద్రాః అన్న పదిముద్రలను చూపించి ఆయాస్థలమందుగల వాక్యములను జెప్పుకొనుచు జేసికొనవలయును.

గోత్రసూత్రముల వచించునప్పుడు [ ] ఈగురుతు వేసియుండు, స్థలమున చెప్పుకొనున దెట్లనగా, వృషగోత్రోత్పన్నాయ, వామదేవార్య ప్రపౌత్రాయ, చంద్రశేఖరాఖ్యస్య పౌత్రాయ, నాగభూషణార్య పుత్రాయ, శరభార్య నామ్నే వరాయ, అని వరునిపక్షమునను వీఁగోత్రోత్పన్నాం మహాదేవార్య ప్రపౌత్రీం గంగాధరాఖ్యస్యపౌత్రీం కేదారేశ్వరార్య పుత్రీం. భద్రకాళీ నామ్నీం కన్యాం అని వధువుయొక్క విషయమందును ఆయాపేరులను ఆపై గురుతుగల స్థలమున సంబంధముచేసి చెప్పవలయు. ( ) ఈగుర్తని చిహ్నములుగలవి వేద ఆగమ, మంత్రములని తెలియదగును. మరియు, గణపతిపూజకంటె ముందలు కలశ గణాధిపతిపూజకు క్రావ పుటయందుగల, కలశస్యముఖే౽ద్రః, అనుమంత్రమున పాత్రపై రెండుచేతులనుమూసి, అష్టోపచారముల బూజించి దీనియుదకము చేతనే గణపతిపూజ మొదలగునవి ఈవిధిప్రకారము జేయవలయు. ఇందులో గౌరీపూజలేదని సందేహింపదగదు. ఏలన ముందుజేయుబడు పాణిగ్రహణమైనపిమ్మట ప్రత్యేకముగ ఉమామహేశ్వర కలశస్థాపనయగును గాన, ఇటకు శ్రీ నామోచ్చారమే, సమృద్ధియగును. మరియు గణపతిపూజయందు శ్రీ = నమః అనియున్నచోట శ్రీ మహాగణాధిపతయేనమః అని చదువుకొనదగును. స్వస్తివాచనమున వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక, పుష్యరాగములను పంచరత్నములు దొరకని పక్షమున వాని మారుగా సువర్ణమునైనను లేక వెండి రాగియైనను శక్త్యనుసారము వేయవలయును. ప్రతిగృహీతృవుచేతను వధువు చేతను దాతచేతను వరునిచేతను అనిపించవలసిన మంత్రములను వాక్యములను కాలావకాశముండిన వారి ముఖముననే అనుపించుట యుక్తము. అటుల దుర్లభమైన, వారిపక్షమున పురోహితుడు మంత్రపఠనమొనర్చుచు క్రియలను మాత్రము వారిచే జెయించుచుండవలయును. వివాహముపర్యంతము పూజాసమయమున వధూవరులను తలిదండ్రులు యెడబాయకుండవలయును. అంకురార్పణపాత్రలు బంగారు, వెండి, తామ్ర, మట్టిలోనేపాత్రలైనను కంచుళ్ళవలె నుండవలయును. కలశపూజలో అఘోరేభ్యః అంగు అనియున్నస్థలమున అంగుష్ఠాభ్యాంనమః అనియును తర్జని అనుచోట తర్జనీభ్యాంనమః అనియును మధ్యమ అన్న చోట మధ్యమాభ్యాంనమః అనియును అనామి అన్నస్థలమున అనామికాభ్యాంనమః అనియును కని అన్నస్థలమున కనిష్ఠకాభ్యాంనమః అనియును ఈశాన్య కలశపూజలో ఎటులకరన్యాస మొనర్తురో అటులే యొనర్పవలయును. మరియు

విద్యాకలాయై రూపగ్రహణసాధనాయ అను స్థలమున విద్యాకలాయైనమః అని నమః శబ్దమును ప్రతిశబ్దాంత్యమున పూరించి చెప్పవలయును. ఏవంహృదయాదిన్యాసః అనుచోట యేమంత్రముచే కరన్యాసమొనర్తురో ఆమంత్రము చేతనే హృదయాయనమః శిరసేస్వాహా,కవచాయహుం,నేత్రత్రయాయవౌషట్ శిఖాయైవషట్, అస్త్రాయఫట్ అని వెనుక కలశమందు క్రరీతిని జెప్పుకొని ఆయాస్థలములందు ముట్టుచుండవలయు. వివాహము కన్యాగృహమందొనర్చుటయేయోగ్యము. అట్లుగానిచో వరుని మందిరముననే జేయదగును. కానిసమస్త కర్మలను కన్యతండ్రియే జేయవలసి యుండునుగావున విడిదియందు కన్యనుంచి దాతృవు వరుని గృహమందుండి కర్మనెరవేర్చవలయును. భాషికములను యెవరి గృహమందు వారికే కట్టవలయు. కాని పంచకలశారాధన జేయునప్పుడు వరుడక్కరలేదు. మధుపర్కపాత్రలు స్థాలీలుగా నుండదగు. వరపాదార్చన సమయమందు క్వచిత్ మూర్ఖశిఖామణులు కన్యాపాదములను జేర్చి కడగు దురభ్యాసముకలదుగాని అటులొనర్చ కూడదు. వరపాదార్చనమొనర్చి కన్యను హస్తమునకందించుటయే శాస్త్రసమ్మతము. లగ్నదివసము మొదలుకొని నాల్గు దినముల పర్యంతము ప్రతిదినమున వధూవరుల నభ్యంగనస్నానమొనర్చి ఉదయ సాయంకాలములయందు కలశపూజ నాచరింపించుచు స్వస్తినాందీఅంకురార్పణ పాత్రలపై గంధాక్షత పుష్పపూజజేయించుచు మాహేశ్వరారాధనమైన పిదప నృత్యగీత మంగళతూర్యములచేతను వనవిహారఫలమధుభక్షణాదులచేతను వధూవరుల చిత్తమానందింప జేయుకతమున బ్రొద్దుబుచ్చుచుండదగును. మరియు పంచకలశములను స్వస్తివాచన అంకురార్పణ పాత్రల నిశ్చయముగా వివాహమంటప సమీపాంగణముననే అన్యమతీయులు ముట్టకుండునటుల నిర్బంధించి స్థాపించవలయు. స్థలసంకోచమున వసతిగాకయున్న దేవతార్చనగృహమందుంచవలయు. మరియు పంచకలశములను ఈశాన్య తత్పురుష అఘోర వామదేవ సద్యోజాత ఆచార్యపూజలను క్రమముగా ఆయాగోత్రోత్పన్నులచే జేయించవలయును. కాని ఈశాన్య కలశపూజను గృహగురువుచే జేయించవలయు. కలశములచే లభించిన దక్షిణ మొదలగువానిని ఆయాగోత్రోత్పన్నులు గ్రహించివివాహమునకు రాబడిన మాహేశ్వరులు తమతమ ఉపబగులతో కూడినవారైనచో వారికితమకలశ దక్షిణలో సగభాగమును బంచి యీయవలయు. ఇక్కివవిషయము లీపుకస్తమందుండు ప్రకారము నాచరించిన నేసందేహము సంభవించనేరదు. కావున పాఠకులు జాగ్రత్తగా నదివి నీయంశములన్ని స్మరణలోనుంచుకొనుటకు గద్యరూపమె సాధ్యమనియు ఈపైన వివరించిన పంచోపచారములు ముద్రాలక్షణము మొదలగు సమస్తవిషయములకును వీరశైవసిద్ధాంత గ్రంథరీత్యా ప్రమాణములున్నను గ్రంథవిస్తరభీతిని మాతృభాషయందు మధ్యథామతిచే తేటతెల్లముగ సాధ్యమైనన్ని నీవిషయములను మహాశయులగు మీరు సార్థకమొనర్తురనియె వ్రాసితిని:—

చి॥ మ॥ వీరభద్రశర్మ.



శ్రీ గురూమాపతయే నమః

# వీరశైవవివాహవిధిః

## వివాహాంగ భూతవాగ్దానం

జ్యోతిర్విదాదిష్టే వివాహనక్షత్రాదియుతే శుభకాలే ద్వాభ్యాం చతుర్భి రష్టభిః ప్రశస్తవేషధారిభిః (అనృక్షరా ఋజవస్సంతు పంథాయేభిస్సఖాయో యంతి నోవరేయం। సమర్యమా సంభగో నోనినీయాత్సంజాస్పత్యం సుయమమస్తుదేవాః) ఇతిమంత్ర ముచ్చరద్భిర్మాహేశ్వరైః। తావతీభిః పురంధ్రీభిర్మంగళగీత తూర్యైశ్చసహ శకున దర్శనపూర్వక మలంకృత వరయుతాః కన్యాగృహమేత్య వరేణ తత్పిత్రాదినాపి ప్రార్థితాః బాంధవాస్సదసి భద్రాసనే ప్రాఙ్ముఖీం సాలంకారాం సువేషాం కన్యాముపవేశ్య తద్ధస్తే ఫల తాంబూలాదీని దత్వా శ్రీసాంబసదాశివస్మరణపూర్వకం ప్రాఙ్ముఖాసీనాః ప్రత్యఙ్ముఖా వా [ ] ప్రవరాన్వితగోత్రోత్పన్నాయ [ ] ప్రపౌత్రాయ [ ] పౌత్రాయ [ ] పుత్రాయ [ ] నామ్నేవరాయ [ ] గోత్రోత్పన్నాం [ ] ప్రపౌత్రీం పౌత్రీం

---

అనగా వివాహమొనర్చుటకు పూర్వము నిశ్చితార్థము జేయుటకై వరుని బంధువులు తమవెంట సమసంఖ్యగల మాహేశ్వరులను ముత్తైదువలను తీసికొని శుభముహూర్తమందు మంగళవాద్యసమేతులై మాహేశ్వరులు 'అనృక్షరా ఋజవస్సంతు' అనుమంత్రమును జెప్పుచు, శుభశకునములం జూచికొని, వరసహితులై కన్యాగృహమును ప్రవేశించి తమచే ప్రార్థింపబడిన కన్యాపక్షమువారలు సభయందు కన్య నలంకరించి పూర్వముఖముగా పీఠమందు గూర్చుండబెట్టి ఆమె హస్తమందు ఫలతాంబూలాదులనిచ్చి, వరునిపక్షమువారలు పూర్వముఖముగానైనను లేక పశ్చిమముఖముగానైనను కూర్చొని, ఈగోత్రోత్పన్నుడైన వీరల మునిమనుమడైన ఇటువంటివారల మనుమడైన వీరలపుత్రుడగు ఈపేరుగల వరునికి ఈగోత్రోత్పన్నయైన యీయాయనముని మనుమరాలైన ఇటువంటివారల మనుమరాలగు వీరలపుత్రియగు ఈనామముగలకన్యను

[ ] పుత్రీం [ ] నామ్నీం కన్యాం భార్యాత్వాయ వృణీమహే. ఇతిబ్రూయుః॥ అథ దాతా భార్యాజ్ఞాతిబంధ్వనుమతిం కృత్వా యథోక్తమనూద్య వృణీధ్వమితి వదేత్. ఏవం పునర్ద్విః ప్రయుజ్య ప్రదాస్యామీతిచోచ్చైస్త్రిర్వదేత్. తతోవరపితాదిగంధాక్షతవస్త్రభూషణపుష్పాదిభిః కన్యామలంకుర్యాత్. అథదాతా స్వయం ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖం వరం పూజయిత్వా ఆచమ్య పూర్వాభిముఖస్సన్ కన్యాం వామత ఉపవేశ్య పత్న్యాసహ దేశకాలౌ స్మృత్వా కరిష్యమాణ వివాహాంగభూతవాగ్దానమహం కరిష్యే. ఇతిసంకల్ప్య కలశపూజాదిమాహేశ్వరపూజాంతం యథాచారం కృత్వా స్వస్థానే ప్రతిగృహీతాముపవేశ్య స్వయంతత్పురత ఉదఙ్ముఖఉపవిశ్య తం గంధతాంబూలాదినా సోపి దాతారం పూజయిత్వా తతో దాతా ఆచారతః పంచహరిద్రాఖండాని పంచపూగఫలాని గంధాక్షతాలంకృతాని గృహీత్వా [ ] ప్రవరాన్వితగోత్రోత్పన్నాయ [ ] ప్రపౌత్రాయ [ ] పౌత్రాయ [ ] పుత్రాయ [ ] నామ్నే వరాయ [ ] ప్రవరాన్విత గోత్రోత్పన్నాం [ ] ప్రపౌత్రీం [ ] పౌత్రీం [ ] పుత్రీం [ ] నామ్నీం కన్యామిమాం జ్యోతిర్విదాదిష్టే సుముహూర్తేవాచా సంప్రదదే. ఇతిచోక్త్వా, అవ్యంగేపతితేక్లీబే దశదోషవివర్జితే। ఇమాంకన్యాం ప్రదాస్యామిభక్తమాహేశసన్నిధౌ॥ ఇతి ప్రతిగృహీత్రే వస్త్రప్రాంతే తాని

---

పత్నినిగా వరించెదమని చెప్పేది. అనంతరము కన్యనిచ్చువాడు తనపత్నిబంధు మొదలగు వారల అనుమతిపై అటులె కానిండని వప్పుకొనునది. ఈపైన జెప్పినట్లే మరియు రెండుసార్లుజేసి, కన్యను నిశ్చయముగా ఇచ్చెదమని అందరు వినునట్లు గట్టిగా చెప్పేది. తర్వాత వరునిసంబంధులు కన్యను వస్త్రాదులచేత అలంకరించగా దాతృవు (కన్యాతండ్రి) ఉత్తరముఖముగా గూర్చొని పూర్వముఖుడగు వరుని బూజించి ఆచమన మొనర్చి పూర్వముఖముగా కన్యను తనయెడమభాగమునందు పత్నిసమేతుడై కూర్చొండబెట్టుకొని వాగ్దానముజేసెదనని సంకల్పించి తదుపరి కలశపూజ మహేశ్వరపూజ మొదలగు వానినిజేసి తన స్థలమందు ప్రతిగృహీతృవును (వరుని తండ్రిని) కూర్చుండబెట్టి తాను ఆయనముందర ఉత్తరముఖముగా గూర్చొని, ప్రతిగృహీతృవును పుష్పాదులచే పూజించేది. ఆయనకూడా దాతృవును పూజించినపిదప దాతృవు ౫ పసుపుఉండలను ౫ పోకలను తీసికొని పైనజెప్పినట్లే కన్యావరుల గోత్రాదులనుజెప్పి వాగ్దానమును

పూగఫలాని, పంచహారిద్రాఖండాని బద్ధ్వా గ్రంథిం గంధాదిభిరభ్య ర్చయేత్। తతః ప్రతిగృహీతాపి పంచపూగఫలాని పంచహారిద్రా ఖండాని [ ] గోత్రోత్పన్నవరవిషయే భవంతో నిశ్చితా భవంతు. ఇతి దాతృవస్త్రప్రాంతే ప్రక్షేపాది కుర్యాత్। తతోదాతా వాచాదత్తా మయాకన్యా పుత్రార్థం స్వీకృతా త్వయా। కన్యావలో కనవిధౌ నిశ్చితస్త్వం సుఖీభవ॥ ఇతి వరపితరం ప్రతివదేత్। వరపితాపి వాచాదత్తా త్వయాకన్యా। పుత్రార్థం స్వీకృతా మయా। వరా వలోకనవిధౌ నిశ్చితస్త్వం సుఖీభవ॥ ఇతి దాతారం ప్రతివదేత్। తతో మాహేశ్వరాః॥ ఓం స్వస్తి శివా ఆపస్సంతు। సౌమనస్యమస్తు, అక్షతం చారిష్టంచాస్తు, దీర్ఘమాయుశ్శాంతిః పుష్టిస్తుష్టిశ్చాస్తు। ఏతద్వచస్సత్య మస్తు, ఇత్యుక్త్వా (సమానీవ అకూతిస్సమానాహృదయాని వః సమాన మస్తు వో మనో యథా వస్సుసహాసతి ప్రసుగ్మంతా ధియా సానస్యసక్షణి వరేభిర్వరాం అభిషుప్రసీదత॥ అస్మామిందద్రఉభయం జుజోషతి యత్సో మ్యస్యాంధసో బుబోధతి హింకృణ్వతి వసుపత్నీ వసూనాంవత్సమిచ్ఛంతి మనసాభ్యాగాత్। దుహామశ్విభ్యాం పయో అఘ్న్యేయం సావర్ధ తాం మహతే సౌభగాయ) ఇతిపఠేయుః తతోదాతా పాత్రస్థ సితతండు లపుంజే. త్రైలోక్యవల్లభాం దివ్యాం గంధమాల్యాంబరాన్వితాం। నవ లక్షణసంయుక్తాం సర్వాభరణభూషితాం॥ అనర్ఘమణిమాలాభిర్భా సయంతీం దిగంతరం। విలాసినీసహస్రైస్తు సేవ్యమానామహర్నిశం॥ ఇతిగౌరీమావాహ్య షోడశోపచారైఃపూజయేత్। కాత్యాయని నమస్తు భ్యం శంకరప్రియభామిని। వివాహభాగ్యమారోగ్యం పుత్రలాభంచ దేహి మే॥ ఇతికన్యా గౌరీం ప్రార్థయేత్. తతః పురంధ్రీభిః నీరాజనాది

---

జేసితిననిచెప్పి 'అవ్యం...సన్నిధా" అని ప్రతిగృహీతృవుయొక్క వస్త్రముకొనయందు వాటినిగట్టి ఆయుడీని గంధాదులచే పూజించేది. ఇటులే ప్రతిగృహీతృవుకూడా చేసేది. దాతృవు "వాచా...సుఖీ...భవ" అని ప్రతిగృహీతృవును గురించి చెప్పేది. ఆయన కూడా "వాచా...సుఖీభవ" యని దాతనుగురించి చెప్పేది, తదుపరి మాహేశ్వరుడు "సమానీవ...సౌభగాయ" అని ఆశీర్వాదమును జేసేది. తర్వాత ఒకతపురుంశ ళభ్రమగు బియ్యమును నింపి, దానియందు గౌరిని 'త్రైలోక్య.....మహర్నిశం' అనుచు నావాహించి పూజించవలయు. తదుపరి కన్య 'కాత్యా...దేహిమే' అని

మాంగళికం కార్యం మాహేశ్వరాశ్చ గంధతాంబూలాదినా పూజితాః. ఆశీర్మంత్రైః పఠేయుః॥ ఇతి వాగ్దానవిధిః॥

## వివాహ పూర్వదినకర్తవ్యం

తతః వైవాహికే శుభేముహూర్తే వధూవరయోః తైలహరిద్రారోపణాది యథాచారం కార్యం॥ అథ వధూపితా వరపితాచ వివాహదినాత్పూర్వేద్యుః। పూర్వాహ్ణే సపత్నీకః కృతాభ్యంగోధృతమాంగళిక వేషః కృతనిత్యక్రియః మంగళసంభారం సంభృత్య కృతలేపన రంగమాలికే ప్రాంగణే శుభాసనే ప్రాఙ్ముఖఉపవిశ్య స్వస్య దక్షిణతః పత్నీం తద్దక్షిణతః కన్యాం వరంచోపవేశ్య తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ విద్యాబలం దైవబలం తదేవ గౌరీపతే తేంఘ్రియుగం స్మరామి॥ దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి। సానో మంద్రేషమూర్జం దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు (ధృవంతే రాజావరుణో ధృవం దేవో బృహస్పతిః ధృవంత ఇంద్రాశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధృవం। సుముహూర్తోऽస్తు. సుప్రతిష్ఠితమస్తు॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం। కుర్యాద్ఘంటారవం భక్త్యా దేవతాహ్వానలాంఛనం॥ నాదశబ్దమయీంఘంటాం సర్వవిఘ్నాపహారిణీం పూజయేదస్త్రమంత్రేణ దేవతాహ్వానలక్షణాం॥ ఘంటామూలే తథా దేవీ గళోర్ధ్వే శిరమూలకే। వసవశ్చాలమగ్రిస్థాస్సర్వే వసతు శంకర॥ ఇతి ఘంటానాదం కృత్వా ఇష్టదేవతాం ధ్యాత్వా ఆచమ్య ప్రాణానాయమ్య

---

ప్రార్థించేది. తర్వాత హారతి మొదలగువానిని జేసేది. మాహేశ్వరులు ఆశీర్వదించవలయును.

ఇకముందు జెప్పు కర్మలను వివాహపూర్వదినమందు జేసెదరు. 'శ్వఃకరిష్యమాణ' యనిగూడా వివాహదివసమందే జెప్పెదరు కాని "అద్యకరిష్యమాణ" యని సంకల్పమును వచించునప్పుడు జాగరూకతగా వచించవలయును. తదుపరి వధూవరులకు తైలహరిద్రాలేపనకార్యములను సల్పేది. ఆపైన దాతృవు స్నానాది నిత్యకర్మలందీర్చి, పత్నీసమేతుడై శుచిగా రంగవల్యాదులచే నలంకృతమగు ప్రదేశమందు పీఠముపై కుడి ప్రక్కన భార్యను ఆమెకుడి ప్రక్కన కన్యను కూర్చుండబెట్టుకొని ప్రతిగృహీతృవుకూడా నిట్లే వరుని గూర్చుండబెట్టుకొని 'తదేవ స్మరామి' అని ఇష్టదేవతను ధ్యానించి 'దేవీం.......ధృవం' అని చెప్పి ఘంటానాదమొనర్చి ఆచమన ప్రాణాయామముల సల్పి గోత్రాదు

దేశకాలౌ సంకీర్త్య. [ ] శర్మణః పుత్రీస్య కన్యాయాః శ్వః కరిష్యమాణ వివాహాంగభూత స్వస్తిపుణ్యాహవాచనం నాందీసమారాధనం అంకురార్పణం మంటపదేవతాప్రతిష్ఠాం కులదేవతా ప్రార్థనంచ కరిష్యే......॥ ప్రారిప్సితస్య వివాహకర్మణః నిర్విఘ్నేన ఉత్తరోత్తరాభివృద్ధ్యర్థం ఆదౌ శ్రీమహాగణపతిపూజాం కరిష్యే॥ ఇతి సంకల్ప్య.

సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమ్రకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః ద్వాదశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి। విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా॥ సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే। శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం। ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥ అభీప్సితార్థసిద్ధ్యర్థం పూజితో యః సురైరపి। సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః॥ గణానాంత్వా గృత్సమదో గణపతిర్జగతీ గణపత్యావాహనే వినియోగః॥

(గణానాంత్వా గణపతిం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనం) అస్మిన్మండలే భూః, గణపతిమావాహయామి। భువః గణపతిమావాహయామి। స్వః గణపతిమావాహయామి । భూర్భువస్స్వః గణపతిమావాహయామి. ఇత్యావాహ్య నవశక్తిపూజాం కరిష్యే॥ తీవ్రాయైనమః, జ్వాలిన్యైనమః, నందాయైనమః, భోగదాయిన్యై నమః, కామరూపిణ్యైనమః, ఉగ్రాయైనమః, తేజోవత్యైనమః, సత్యాయైనమః, విఘ్ననాశిన్యైనమః, ఓం నమో భగవతే సకలగుణాత్మకశక్తియుతాయ మహాగణాధీశ్వరాయ యోగపద్మపీఠాత్మనేనమః। సువర్ణపీఠం కల్పయామి। స్వాత్మసంస్థమజం శుద్ధం త్వామద్య గణనాయక । అరణావివ హవ్యాశమూర్తి మావాహయామ్యహం॥ ఓం భూర్భువస్సువరోం సశక్తిసాంగసాయుధ, సవాహన సపరివార మహాగణాధీశ్వర

---

లను జెప్పి ఇటువంటి వరునకును ఈకన్యకును రేపటిదినమును జేయదగు వివాహకర్మమున కంగమగు పుణ్యాహాదులైన కర్మలను జేసెదనని మరియు నారంభించుకర్మలం నిర్విఘ్నముగా సమాప్తియగుటకై ఆదియందు విఘ్నేశ్వరపూజ నొనర్చెదనని సంక

అత్రాగచ్ఛాగచ్ఛ, ఆవాహయామి. ఆవాహితో భవ, స్థాపయామి స్థాపితో భవ, సన్నిహితో భవ, అవకుంఠితో భవ, వ్యాప్తో భవ, ఇతి షణ్ముద్రాః ప్రదర్శ్య- ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నో విఘ్నేశ్వరః ప్రచోదయాత్. గాం హృదయాయ నమః, గీం శిరసే స్వాహా. గూం శిఖాయై వౌషట్. గైం కవచాయ హుం. గౌం నేత్రత్రయాయ వషట్. గః అస్త్రాయ ఫట్. ఓం భూర్భువస్సువరోం॥ ఇతిదిగ్బంధః॥ ధ్యానం॥ రక్తో రక్తాంగరాగాంశుక కుసుమయుత స్తుందిలశ్చంద్రమౌళిర్నేత్రైస్త్రిభిర్వామనకరచరణో బీజపూరాత్తవాసాః॥ హస్తాగ్రక్లుప్తపాశాంకుశగదవరదో నాగవక్త్రోఽహిభూషో దేవః పద్మాసనస్థో భవతు నతసురో భూతయే విఘ్నరాజః॥ గం గణపతయే నమః॥ ఇతిజపం కృత్వా, శ్రీమహాగణాధిపతయే నమః. ధ్యాయామి ధ్యానం సమర్పయామి. ఆవాహయామి ఆసనం సమర్పయామి. పాదయోః పాద్యం సమర్పయామి. హస్తయోరర్ఘ్యం సమర్పయామి. ముఖాంబుజే ఆచమనీయం సమర్పయామి॥ (ఆపోహిష్ఠా మయోభువ స్తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే యోవశ్శివతమో రసస్తస్య భాజయతేహనః ఉశతీరివ మాతరః తస్మా అరంగమామవో యస్య క్షయాయ జిన్వథ ఆపోజనయథాచనః। శ్రీమహాగణాధిపతయే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి ఆచమనీయం సమర్పయామి (త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం। ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥ శ్రీమహాగణాధిపతయే నమః భసితం పరికల్పయామి) (యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రా మంతవో హ సర్గాః అవాతిరతమనృతాని విశ్వబుతేన మిత్రా వరుణా సచేతే) శ్రీమహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి (గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం) శ్రీ నమః॥ గంధం ధారయామి (అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత అర్చంతు పుత్రకాః। ఉత పురన్న ధృష్ణ్వర్చత అర్చత ప్రార్చత) శ్రీ నమః॥ అక్షతాన్

---

ల్పించి, "గణా...సాదనం" అని ఆవాహనజేసి అనంతరము క్రమముగా ఆయా మంత్రములచే షోడశవిధమగుపూజను జేసేది, పిమ్మట 'యస్య...భవతు' అనువరకును

సమర్పయామి॥ సుముఖాయ నమః, ఏకదంతాయ నమః, కపిలాయ నమః, గజకర్ణకాయ నమః, లంబోదరాయ నమః, వికటాయ నమః, విఘ్నరాజాయ నమః, గణాధిపాయ నమః, ఫాలచంద్రాయ నమః, గజాననాయ నమః, ధూమకేతవే నమః, సిద్ధివినాయకమూర్తయే నమః॥ శ్రీ=నమః॥ పుష్పాణిసమర్పయామి॥ స్తుహిశ్రుతం గర్తసదం యువానం మృగన్నభీమముపహత్నుముగ్రం। మృడాజరిత్రే రుద్రస్తవానో అన్యంతే అస్మన్నివపంతు సేనాః॥ శ్రీ...నమః॥ ధూపమాఘ్రాపయామి॥ (కుమారశ్చిత్పితరం వందమానం ప్రతినానామ రుద్రోపయంతం భూరేర్దాతారం సత్పతిం గృణీషేస్తుత స్త్వం భేషజా రాస్యస్మే) శ్రీ=నమః॥ దీపం దర్శయామి (యావో భేషజా మరుతశ్శుచీని యా శంతమా వృషణో యా మయోభు యానిమనురవృణీ తా పితానస్తా శంచయోశ్చ రుద్రస్య వశ్మి॥ శ్రీమహా...నమః॥ నైవేద్యం సమర్పయామి॥ అనంతరమాచమనీయం సమర్పయామి॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లిదళైర్యుతం। కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥ శ్రీ సిద్ధివినాయకాయ నమః॥ తాంబూలం సమర్పయామి। అనంతరమాచమనీయంసమర్పయామి। హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః। అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ శ్రీ=నమః॥ యథాశక్తిదక్షిణాం సమర్పయామి॥ (బహుగ్వై బహ్వాశ్వాయై బహ్వాజావికాయై బహువ్రీహియవాయై బహుమాషతిలాయై బహుహిరణ్యాయై బహుహస్తికాయై బహుదాసపూరుషాయై రయిమత్యై పుష్టిమత్యై బహురాయస్పోషాయై రాజాస్తు సామ్రాజ్యంభౌజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం మహారాజ్యమాధిపత్యం)। శ్రీ=నమః॥ కర్పూరదీపం దర్శయామి॥ (వ్యతిషక్తాభిస్తువతే వ్యతిషక్తో వై గ్రామణీ సజాతైః। సజాతైరేవైనం వ్యతిషజతి వ్యతిషక్తాభిస్తువతే వ్యతిషక్తో వై పురుషః పాప్మభిః వ్యతిషక్తాభిరేవాస్య పాప్మనోనుదతే॥ శ్రీ సిద్ధి వినాయకాయ నమః॥ ఘంటానాదం సమర్పయామి॥ ఆచమనీయం సమర్పయామి। నిషుసీద గణపతే గణేషుత్వామాహుర్విప్రతమం కవీనాం నఋతేత్వత్క్రియతే కించనారే మహామర్కం మఘవం చిత్రమర్చ) శ్రీ=నమః

పుష్పాంజలిం సమర్పయామి॥ ప్రకృష్టపాపనాశాయ ప్రకృష్టఫలసిద్ధయే ప్రదక్షిణం కరోమీశ ప్రసీద పరమేశ్వర॥ సర్వార్థసాధనోపాయ సర్వైశ్వర్యప్రదాయక। సమస్తాపత్ప్రతీకార చంద్రశేఖర తేనమః॥ ఇతి శిరసా ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి॥ యస్య స్మృత్యాచనామోక్త్యా తపఃపూజాక్రియాదిషు న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే సదాశివం॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప। యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥ అనయాపూజయా శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు॥ ఇతి సాక్షతజలం విసృజేత్। యజ్ఞేనయజ్ఞమయజంతదేవా స్తానిధర్మాణిప్రథమాన్యాసన్ తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వేసాధ్యాస్సంతి దేవాః॥ ఇతిగణపతిం యథాస్థానం ప్రతిష్ఠాపయామి। పునరాగమనాయచ ఇతి గణపతిపూజాం కుర్యాత్॥

## స్వస్తివాచనం

రంగవల్ల్యాదియుక్తే భూతలే(మహీద్యౌఃపృథివీచన ఇమం యజ్ఞం మిమిక్షతాం పిపృతాన్నోభరీమభిః) ఇతి దక్షిణోత్తరతో ప్రత్యేకం భూమిం స్పృష్ట్వా జపేత్। (ఓషధయ స్సంవదంతే సోమేన సహరాజ్ఞా యస్మైకృణోతి బ్రాహ్మణ స్తంరాజన్పారయామసి) ఇతిమంత్రావృత్త్యా పర్ణద్వయమాస్తీర్య (యేనతోకాయతనయాయ ధాన్యం బీజం వహధ్వే అక్షితం అస్మభ్యం తద్ధత్తనయద్వ ఈమహే రాధోవిశ్వాయు సౌభగం) ఇతిప్రస్థపరిమితం తండులపుంజౌకృత్వా॥ (ఆకలశేషుధావతే శ్యేనోవర్మవిగాహతే అభిద్రోణాకనిక్రదత్) ఇతిపుంజోపరిధాతుమయా మృణ్మయావా కలశౌ నిధాయ(ఇమంమేగంగే యమునే సర

---

జెప్పి జలాక్షతలను విడిచేది. తర్వాత 'యజ్ఞేన......సంతిదేవాః' యనువరకు జెప్పి గణపతిని పీఠమునుండి క్రిందికి బెట్టవలయును.

శుద్ధమగుప్రదేశమందు 'మహీ......మభిః' అని దక్షిణోత్తరభాగములందు ప్రత్యేకముగా భూమినిముట్టి జపించి ఆరెండుస్థలములలో 'ఓష......మసి' అని రెండు అరటియాకులను బరచి వానిపై "ఆక......వర్ధతే" అని మృణ్మయాదిగా నేలోహపాత్రనైననుంచి వానిలో "ఇమం......మయా' అని శుద్ధజలముచే నింపి

స్వతి శుతుద్రిస్తోమం సచతాపరుష్ణ్యా అసిక్న్యామరుద్వృధే వితస్తయా ర్జీకియే, శృణుహ్యా సుషోమయా) ఇతి తీర్థజలేన ప్రత్యేకం పూరయిత్వా, (గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టామ్ కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం) ఇతి గంధం కలశయో ర్దద్యాత్॥ చందనాదినా తావనులిప్య, మాలాభూషితౌ కృత్వా, (సహిరత్నాని దాశుషే సువాతి సవితా భగః। తం భాగం చిత్రమీమహే) ఇతి పంచరత్నాని నిక్షిప్య. (ప్రవో యజ్ఞేషు దేవయంతో అర్చన్ద్యావానగ్ం హోభిః, పృథివీ ఇషధ్యై ఏషాం బ్రహ్మాణ్యసమాని విప్రా విష్వగ్వియంతి వనినో న శాఖాః) ఇతి ఆమ్రపల్లవాని నిక్షిప్య, (హిరణ్యరూప స్సహిరణ్య సందృగపాన్నపాత్సేదు హిరణ్యవర్ణః। హిరణ్యయాత్ పరియోనే ర్నిషద్యా హిరణ్యదా దదత్యన్నమస్మై) ఇతి హిరణ్యం దద్యాత్। (పూర్ణాదర్వి పరాపత సుపూర్ణా పునరాపత వస్నేవ విక్రీణావహా। ఇషమూర్జగ్ం శతక్రతో॥ యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః। బృహస్పతిప్రసూతాస్తానో ముంచత్వంహసః) ఇతి మంత్రాభ్యాం కలశయోరుపరి నారికేళఫలే నిక్షిప్య. (అభివస్త్రా సువసనా న్యర్షాభి ధేనూస్సుదుఘాః పూయమానః। అభిచంద్రా భర్తవే నో హిరణ్యాభ్యశ్వాన్రథినో దేవసోమ) ఇతి కలశయోరుపరి వస్త్రే నిదధ్యాత్॥ (తంతుం తన్వన్రజసో భానుమన్విహి। జ్యోతిష్మతః పథో రక్ష ధియాకృతాన్। అనుల్బణం వయత జోగువా మపో మనుర్భవ జనయా దైవ్యంజనం) ఇతి శ్వేతతంతుభి ర్వేష్టయేత్॥ తత్వాయామీత్యస్య శునశ్శేపో వరుణస్త్రిష్టుప్ కలశే వరుణావాహనే వినియోగః। (తత్వాయామి బ్రహ్మణా వందమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహబోధ్యురుశగ్ం సమాన ఆయుః ప్రమోషీః) ఇతి వరుణమావాహ్య, కలశస్య ముఖే రుద్రః కంఠే విష్ణుస్సమాశ్రితః। మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్మృతాః। కుక్షౌతు సాగరా

---

“గంధ...శ్రియం” అని గంధమును కలశములందు వేసి మీదకూడ యలంకరించి పుష్ప మాలికలనుజుట్టెడి. “సహి...మహే” యని యైదురత్నములను వానియందుంచి

స్సర్వేసప్తద్వీపావసుంధరా। ఋగ్వేదోథయజుర్వేదస్సామవేదోహ్యథర్వణః। అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః। గాయత్రీచాత్ర సావిత్రీ శాంతిః పుష్టికరీతథా। సర్వేసముద్రా సరితస్తీర్థాని జలదా నదాః। ఆయాంతు మమశాంత్యర్థం దురితక్షయ కారకాః। ఇతి ఉత్తరకలశే దేవతామావాహయేత్॥ వరుణాది దేవతాభ్యోనమః। ధ్యాయామి ధ్యానం సమర్పయామి। ఇత్యాదిషోడశోపచారైస్సంపూజ్య సర్వేషు కాలేషు సమస్తదేశేష్వశేషకార్యేషు తథేశ్వరేశ్వరః। సర్వస్వరూపీ భగవానసనాదిమాన్। మయాస్తు మాంగల్య వివృద్ధయే హరః॥ సర్వేష్వారబ్ధకార్యేషు త్రయస్త్రిభువనేశ్వరాః। దేవా దిశంతు మే సిద్ధిం బ్రహ్మేశాన జనార్దనాః॥ స్మృతే సకలకల్యాణభాజనం యత్రజాయతే పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణంశివం॥ సర్వమంగలమాంగల్యే శివేసర్వార్థసాధకే। శరణ్యేత్ర్యంబకేదేవి నారాయణి నమోస్తుతే॥ తదేవలగ్నం... స్మరామి॥ ఇతి అక్షతాంశ్చ నిక్షిపేత్॥ మాతృభ్యోనమః పితృభ్యోనమః। ఆచార్యేభ్యోనమః। గురుభ్యోనమః। అతిథిభ్యోనమః ఉమామహేశ్వరాభ్యాం నమః। ప్రమథగణేభ్యో నమః। భక్తమాహేశ్వరేభ్యో నమః। ఇతి కలశయోర్నమస్కారం కృత్వా। తతః కర్తా ఆచమ్య ప్రాణానాయమ్య దేశకాలౌ కథయిత్వా వివాహకర్మ కర్తుమాదౌ శుద్ధివృద్ధ్యభ్యుదయసిద్ధిద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం వ్రతనియమస్వాధ్యాయదమదానవిశిష్టైర్మాహేశ్వరైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే॥ పుణ్యాహాంగ చతురో మాహేశ్వరాన్ తోషయిష్యే॥ ఇతి సంకల్ప్య తతః ప్రశస్తాన్ ప్రతివచన

---

"ప్రవో...శాఖాః" అని మామిడిచిగురుల చేనలంకరించి "హిరణ్య...నమస్మై" యని బంగారమువాటియందు నుంచి, "పూర్ణా...హసః" అని కలశములపై నారికేళఫలములను బెట్టి "అభి...సోమా" యని వస్త్రధారణమొనర్చి "తంతుం...జనం" అనిదారమునుజుట్టి "తత్వా......యామి" యని కలశమునందు వరుణునావాహించి 'కలశస్య...... కారకాః' అని ఉత్తరకలశమందు దేవతలనావాహించి యథాక్రమముగా 'వరుణాదిదేవతాభ్యోనమః' అనిచెప్పుచు షోడశోపచార పూజనొనర్చి 'సర్వేషు......నమోస్తుతే' అను శ్లోకములను 'తదేవ......స్మరామి' యనుశ్లోకమును చెప్పుకొని కలశములపై అక్షతలను వేసి 'మాతృభ్యోనమః' ఈమొదలగు వాక్యములను చెప్పుకొని కలశములకు నమ

సమర్థాన్ శుచీన్ సోత్తరీయాన్ దర్భపవిత్రపాణీన్ యుగ్మాన్ మాహేశ్వరాన్, ప్రాఙ్ముఖానుదఙ్ముఖాన్వోపవేశ్య తాన్ గంధపుష్పాక్షతాదిభిరభ్యర్చ్య తాంబూలదక్షిణాదిభిః పరితోష్య మాతృపితృగుర్వాచార్యాదీన్ సంపూజ్య ప్రణమ్య॥ అవనీకృతజానుమండలః ప్రణతిముద్రాం శిరసి ఆధాయ। ఆశిషః ప్రార్థయామీత్యుక్త్వా సత్యాః ఏతా ఆశిషస్సంతు దీర్ఘానాగానద్యోగిరయః త్రీణి విష్ణుపదానిచ తేనాయుః, ప్రమాణేన పుణ్యాహం దీర్ఘమాయురస్తు। ఇతి త్రైరుక్తే పునస్తాన్ మాహేశ్వరాన్ సంప్రార్థయేదేవం॥ శివా ఆపస్సంతు, సౌమనస్యమస్తు। అక్షతం చారిష్టం చాస్తు। గంధాః పాంతు। సౌమంగల్యంచాస్తు। అక్షతాః పాంతు। ఆయుష్యమస్తు। పుష్పాణి పాంతు। సౌశ్రియమస్తు। తాంబూలాని పాంతు। ఐశ్వర్యమస్తు। దక్షిణాః పాంతు। బహుదేయం చాస్తు। దీర్ఘమాయుశ్శాంతిః పుష్టిశ్చాస్తు। అస్తు ఇతిమాహేశ్వరాస్ప్రత్యబ్రూయుః॥ యమాదింకృత్వా సర్వవేదక్రియారంభాః శుభాః ప్రవర్తంతే తమహమోంకారమాదిం కృత్వా భవద్భిరనుజ్ఞాతః పుణ్యాం పుణ్యాహం వాచయిష్యే॥ ఇతిసంప్రార్థయేత్॥ వాచ్యతామితి మాహేశ్వరావదేయుః॥ తతః కర్తా సపత్నీస్సహ భద్రంకర్ణేభిశ్శృణుయామదేవా భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః॥ స్థిరైరంగైస్తుష్టువాం సస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః॥ ద్రవిణోదాద్రవిణసస్తురస్య ద్రవిణోదా సనరస్య ప్రయంసత్। ద్రవిణోదావీరవతీమిషంనో ద్రవిణోదారాసతే దీర్ఘమాయుః॥ సవితా పశ్చాతాత్సవితా పురస్తాత్సవితోత్తరాత్తాత్సవితాధరాత్తాత్ సవితానస్సువతు సర్వతాతిం

---

స్మరించునది. పిదప యజమానుడు ఆచమనప్రాణాయామములను జేసికొని క్రమముగా సంకల్పించి ౪ జనమాహేశ్వరులను కూర్చుండబెట్టుకొని గంధపుష్పాదులచే పూజించి దక్షిణతాంబూలాదుల సత్కరించి ఆచార్యమొదలగువారల నమస్కరించి మోకాళ్లను భూమికి సోకించి కూర్చొని శిరస్సునందు రెండుచేతులను జోడించుకొని "ఆశిషః ప్రార్థయామి" అని చెప్పవలెను. మాహేశ్వరులు 'సత్యా.....స్తు' అని చెప్పవలెను. పునః యజమానుడు "శివా.....పుష్టిస్తుష్టిశ్చాస్తు. అనువరకును చెప్పవలెను. మాహేశ్వరులందరును గూడ 'అస్తు.....అని చెప్పవలయును. యజమానుడు. 'యమాదింకృత్వా.....వాచయిష్యే'.....యనువరకును వచింపవలయు. మాహేశ్వరులు వాచ్యతాం.....అని

సవితానో రాసతాం దీర్ఘమాయుః॥ నవోనవో భవతి జాయమానో ఉహ్నాం కేతురుప సామేత్యగ్రం। భాగం. దేవేభ్యో విదధా త్యాయన్ప్ర చంద్ర మాస్తిరతే దీర్ఘమాయుః (ఆప ఉందంతు జీవసే దీర్ఘాయు త్వాయ వర్చసే॥ యస్త్వా హృదా కీరిణా మన్యమానో మర్త్యం మర్త్యోజోహవీమి। జాతవేదో యశో అస్మాసుధేహి ప్రజాభిరగ్నే రమృతత్వ మస్యాం॥ యస్మైత్వం సుకృతే జాతవేద ఉలోకమగ్నే కృణవస్యోనం। అశ్వినం సపుత్రిణం వీరవంతం గోమంతం రయింనశతే స్వస్తి॥ సంత్వాసించామి యజుషా ప్రజామాయుర్ధనంచ) మనస్సమాధీయతాం ఇతి తాన్ సంప్రార్థ్య సమాహితమనసస్స్మః ఇతి తైరుక్తః ప్రసీదంతు భవంతః ఇతి పునర్వదేత్॥ ప్రసన్నాస్స్మః ఇతి తే ప్రతిబ్రూయుః॥ అథ ఆచారాదేకస్మిన్విశాల పాత్రాదిభాజనే అక్షతాన్నిక్షిప్య ఉత్తరకలశ మాదాయ తదుపరి స్థితంఫలం భూమౌ నిధాయ తత్కలశం సపల్లవం శంఖముద్రయాగృహీత్వా తస్మిన్పాత్రే ప్రతిమంత్రం సించేత్॥ తత్రమంత్రాః శాంతిరస్తు పుష్టిరస్తు తుష్టిరస్తు వృద్ధిరస్తు అవిఘ్నమస్తు ఆయుష్యమస్తు ఆరోగ్యమస్తు స్వస్త్యస్తు శివంకర్మాస్తు కర్మసమృద్ధిరస్తు శాస్త్రసమృద్ధిరస్తు వేదసమృద్ధిరస్తు పుత్రసమృద్ధిరస్తు ధనధాన్యసమృద్ధిరస్తు ఇష్టసంపదస్తు॥ తత్పాత్రస్య బహిరైశాన్యాం అరిష్టనిరసనమస్తు యత్పాపం తత్ప్రతిహతమస్తు॥ ఇతి ద్వాభ్యాం నిషిచ్య యచ్ఛ్రేయ స్తదస్తు ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు. ఉత్తరోత్తర మహరహరభివృద్ధిరస్తు. ఉత్తరోత్తరాః క్రియాశ్శుభాశ్శోభనా స్సంపద్యంతాం. తిథికరణ ముహూర్త నక్షత్ర లగ్న సంపదస్తు. తిథికరణ ముహూర్త నక్షత్రలగ్నాధిదేవతాః ప్రీయంతాం, భగవా న్మహాదేవస్సపత్నీక స్స

---

నుశువవలయును. పిదప యజమానుడు "భద్రం...ప్రజామాయుర్ధనంచ" అని చెప్పి మనస్సమాధీయతాం అని వేడవలయును. సమాహితమనసస్స్మః అని మాహేశ్వరులు చెప్పేది. యజమానుడు... "ప్రసీదంతు భవంతః'... అని చెప్పేది...'ప్రసన్నాస్స్మః'... అనిమాహేశ్వరులును జెప్పేది. పిమ్మట కర్తవు ఒక విశాలమగు పాత్రను ముందునిచి కొని శంఖముద్రచే ఉత్తరదిక్కు కలశమును దీసికొని ఫలమును భూమిమీద నుంచి "శాంతిరస్తు ...... ఇష్ట సంపదస్తు" అను వరకును ౧౫ వాక్యములను చెప్పుచు పాత్రలలోవిడిచేసి. ఆపాత్రవెలుపల ఈశాన్యభాగమందు "అరిష్ట......తత్ప్రతి

సుతః ప్రీయతాం. రేణుకాదిప్రమథగణాః ప్రీయంతాం. అగ్నిపురోగా
విశ్వేదేవాః ప్రీయంతాం, ఇంద్రపురోగా మరుద్గణాః ప్రీయంతాం,
మాహేశ్వరీ పురోగా మాతరః ప్రీయంతాం, శ్రీవిష్ణుపురోగా
సర్వే దేవాః ప్రీయంతాం. ఋషయశ్ఛందాంస్యాచార్యావేదా
యజ్ఞాదక్షిణాశ్చప్రీయంతాం. బ్రహ్మ బ్రాహ్మణాశ్చప్రీయంతాం. శ్రీ
సరస్వత్యౌ ప్రీయేతాం. శ్రద్ధామేధే ప్రీయేతాం. భగవతీ శాంతి
కరీ ప్రీయతాం. భగవతీ పుష్టికరీ ప్రీయతాం, భగవతీ తుష్టికరీ
ప్రీయతాం, భగవతీ వృద్ధికరీ ప్రీయతాం, భగవతీ బుద్ధికరీ ప్రీయతాం,
భగవత్యోలోకమాతరః ప్రీయంతాం, సర్వేస్వస్థానగతాః ప్రీయంతాం,
సర్వాగ్రామదేవతాః ప్రీయంతాం, సర్వాః కులదేవతాః ప్రీయంతాం॥
ఇతిపునఃపూర్వవత్ సించేత్॥(హతాఃపరిపంథినో హతాఅస్యకర్మణో
విఘ్నకర్తారఃశత్రవఃపరాభవం యాంతు. శామ్యంతుఘోరాణి శామ్యం
తుపాపాని, శామ్యంత్వీతయః) ఇతి సప్తభిః బహిఃప్రదేశే నైఋత్యాం
నిక్షిప్య॥ శుభానివర్ధంతాం. శివా ఆపస్సంతు, శివా ఋతవస్సంతు, శివా
ఓషధయస్సంతు, శివావనస్పతయస్సంతు, శివా ఆహుతయస్సంతు, శివా
అతిథయస్సంతు, అహోరాత్రేశివేస్యాతాం నికామే నికామేనః పర్జ
న్యో వర్షతు। ఫలిన్యోన ఓషధయః పచ్యంతాం యోగక్షేమోనః కల్ప
తాం॥ శుక్రాంగారకబుధ బృహస్పతిశనైశ్చర రాహుకేతుసోమసహితా
ఆదిత్యపురోగాస్సర్వేగ్రహాః ప్రీయంతాం. ప్రీయతాం భగవా
న్మహేశ్వరః, ప్రీయతాం భగవాన్ పర్జన్యః, ప్రీయతాం భగవాన్ శక్తి
ధరః। ఇతిపూర్వవత్ కించిత్ కించి జ్జలం నిషిచ్య తత్కలశం పూర్వవ
న్నిధాయ। పుణ్యాహకాలా న్వాచయిష్యే. ఇతి వదేత్। పుణ్యాహకా
లావాచ్యంతామితి వదేయుః।(ఉద్గాతేవశకునే సామగాయసి బ్రహ్మపుత్ర

---

హతమస్తు' అనివిడిచేది. పునః అదేపాత్రయందు' యచ్ఛ్రేయ స్తదస్తు.....కులదేవతాః
ప్రీయంతాం'' అను ౪౨ వాక్యములను చెప్పకొని విడిచేది.'హతాః ...త్వీతయః' అను ౭ వా
క్యములను చెప్పచూ నైరుతియందు విడువవలయును.' శుభాని... శక్తిధరః' అని చెప్పచు
పునః కొంచము కొంచెము అదేపాత్రయందే విడిచేది. కలశమును మొదటివలెనె యుంచి
'పుణ్యాహకాలాన్ వాచయిష్యే' అనిచెప్పేది. 'పుణ్యాహకాలా వాచ్యంతాం
అని మాహేశ్వరులు చెప్పేది. 'ఉద్గాతేవ...మహ్యంసకటుంబాయ భక్తమాహేశ్వర

ఇవసవనేషు శంససి। వృషేవవాజీ శిశుమతీరపీత్యా సర్వతోన శ్శకునే భద్రమావద। విశ్వతోన శ్శకునే పుణ్యమావద॥ యాజ్యయా యజతి ప్రత్త్యవైయా యాజ్యాః పుణ్యైవ లక్ష్మీః పుణ్యామేవ తల్లక్ష్మీం సంభావయతి పుణ్యాం లక్ష్మీం సంస్కురుతే యత్పుణ్యం నక్షత్రం తద్బట్కుర్వీతోపవ్యుషం। యదావై సూర్యఉదేతి అథనక్షత్రం నైతి యావతి తత్రసూర్యో గచ్ఛేత్। యత్ర జఘన్యం పశ్యేత్। తావతికుర్వీత యత్కారీస్యాత్। పుణ్యాహఏవ కురుతే। ఓంతానివా ఏతా నియమ నక్షత్రాణి। యాన్యేవ దేవనక్షత్రాణి। తేషు కుర్వీత యత్కారీస్యాత్। పుణ్యాహఏవ కురుతే మహ్యం సకుటుంబాయ భక్తమాహేశ్వరమహాజనా న్నమస్కుర్వాణాయ ఆశీర్వచన మపేక్షమాణాయ వివాహకర్మణే పుణ్యాహం భవంతోబ్రువంతు॥ ఇతి స్వయం మంద్రస్వరేణోక్త్వా, ఓంపుణ్యాహమితి తథైవతైరుక్తే పునరేవ మధ్యమస్వరేణోక్త్వా తథైవతైరుక్తే। పునరేవోచ్చై స్స్వరేణోక్త్వా। తథైవతైరుక్తే (స్వస్తయేవాయు ముపబ్రవామహై సోమం స్వస్తిభువనస్య యస్పతిః బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసోభవంతు నః। ఆదిత్యఉదసియః పథ్యాయై వేతస్స్వస్త్యాప్రియంతి పథ్యాం స్వస్తి మభ్యుద్యంతి స్వస్త్యైవేతః ప్రియంతి స్వస్త్యుద్యంతి స్వస్త్యుద్యంతి॥ స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవా స్స్వస్తిః పూషా విశ్వవేదాస్స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు॥ అష్టౌదేవా వసవస్సోమ్యాసః చతస్రోదేవీరజరాశ్శ్రవిష్ఠాః॥ తే యజ్ఞం పాంతు, రజసః పరస్తాత్। సంవత్సరీణ మమృతం స్వస్తి) మహ్యం సకుటుంబాయ భక్తమాహేశ్వర మహాజనా న్నమస్కుర్వాణాయ ఆశీర్వచనమపేక్షమాణాయ వివాహకర్మణే స్వస్తిభవంతోబ్రువంతు. ఇతిపూర్వవత్త్రివారముక్త్వా। వివాహకర్మణే స్వస్తిఇతి తైస్తథోక్తే(ఋధ్యామస్తోమం

---

మహాజనాన్నమస్కుర్వాణాయ. వివాహకర్మణే పుణ్యాహం భవంతోబ్రువంతు’ అని సాధారణముగా చిన్నగ వచించేది. ‘ఓంపుణ్యాహం’ అని మాహేశ్వరు లటులే చెప్పేది. కర్తవు “స్వస్తయే...భవంతోబ్రువంతు’ అని పునః మూడుసార్లు చెప్పవది. ‘వివాహకర్మణేస్వస్తి’ అని మహేశ్వరులు చెప్పేది. కర్తవు “ఋధ్యామ...

సనుయామవాజమానో మంత్రిం సరథేహాపయాతం యశోనపక్వం మధుగోష్వంతరాభూత్ాంశో అశ్వినోః కామమప్రాః సర్వాసమృద్ధి మృధ్నుయామితితం వై తేజసైవ పురస్తాత్సియర్భవచ్ఛందోభి ర్మధ్య తోక్షరైరుపరిష్టాద్గాయత్రాస్వి సర్వతోద్వాదశాహం పరిభూయాత్స ర్వాసమృద్ధిమార్ధోన్నోత్సర్వాసమృద్ధి మృధ్నోతి యఏవంవేద॥ ఋధ్యాస స్మ హవ్యైర్నమసోపసద్య మిత్రందేవం మిత్రధేయంనో అస్తు॥ అనూ రాధాన్ హవిషావర్ధయంతః శతంజీవేమ శరదస్సవీరాః॥ త్రీణిత్రీణివై దేవానామృద్ధాని త్రీణిఛందాగ్ంసి త్రీణిసవనాని త్రయఇమేలోకాః ఋధ్యామేవ తద్వీర్య ఏషులోకేషు ప్రతితిష్ఠతి) మహ్యాం సకుటుం బాయ భక్తమాహేశ్వరాన్నమస్కుర్వాణాయ ఆశీర్వచన మపేక్ష మాణాయ వివాహకర్మణే పుణ్యాహం భవంతోబ్రువంతు, వివాహ కర్మణే ఋద్ధిం భవంతోబ్రువంతు. ఓం ఋధ్యతాం ఋద్ధిస్సమృద్ధిః ఏవంత్రిరుక్త్వా (శ్రియే జాతశ్శ్రియఆనిరియాయ శ్రియంవయోజరితృ భ్యోదధాతి శ్రియంవసానా అమృతత్వమాయన్భవంతీ సత్యాసమిధా మితద్రౌ॥ శ్రియఏవైనం తచ్ఛ్రియామాదధాతి సంతతమృచావష ట్కృత్యం సంతత్యైసంధీయతే ప్రజయా పశుభిర్యఏవంవేద॥ ఋచ స్సామాని యజూగ్ంషి సాహిశ్రీరమృతాసతాం॥ శుక్రేభిరంగైరజ ఆతతన్వాన్క్రతుం పునానః కవిభిః పవిత్రైః శోచిర్వసానపర్యాయు రపాం శ్రియోమిమీతే బృహతీరనూనాః) మహ్యాంసకుటుంబాయ భక్త మాహేశ్వరా న్నమస్కుర్వాణాయ ఆశీర్వచన మపేక్షమాణాయ వివాహకర్మణః శ్రీరస్త్వితి భవంతోబ్రువంతు. ఇతివదేత్. అస్తుశ్రీః ఇతిత్రైః ప్రత్యుక్తే కర్మదేవతాత్మకో భగవాన్ప్రజాపతిః ప్రీయతాం

---

భవంతోబ్రువంతు" అని చెప్పేది. 'వివాహకర్మణే ఋద్ధిం భవంతోబ్రువంతు' 'ఓం ఋధ్యతాం ఋద్ధి స్సమృద్ధిః' అని మూడు వేళల మాహేశ్వరులు వచిం చేది, "శ్రియే...వివాహకర్మణః శ్రీరస్తు, ఇతిభవంతో బ్రువంతు" అని కర్త చెప్పేది. పిదప మాహేశ్వరులు "అస్తు...శ్రీః" అని వచించేది. కర్తృఫు 'కర్మ...బ్రు వంతు' అనివచించే?. "ప్రీయతాం...శివం శివమస్తు" అని మాహేశ్వరులు చెప్పేది. అనంతరము త్తరకలశమును కుడిహస్తముచే దక్షిణకలశమును వామహస్తముచే తెను

మితి భవంతోఽబ్రువంతు. ఇతి పునర్వదేత్ ॥ మాహేశ్వరాశ్చ ప్రీయతాం భగవాన్ కర్మదేవతాత్మకః ప్రజాపతిః॥ వర్షశతం సంపూర్ణమస్తు. గోత్రాభివృద్ధిరస్తు, శివంశివమస్తు. ఇతిమాహేశ్వరాః ప్రతిబ్రూయుః॥ తతః ఉత్తరకలశం దక్షిణహస్తే దక్షిణకలశం వామహస్తే గృహీత్వా తాభ్యామేకధారాభ్యాం పూర్వస్మిన్పాత్రే మంత్రపూర్వకం నిషించేత్॥ అత్రమంత్రాః (వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాంత్స్వావేశో అనమీవోభవానః॥ యత్త్వేమహే ప్రతితన్నో జుషస్వశన్నో భవద్విపదే శం చతుష్పదే॥ వాస్తోష్పతే ప్రతరణో నఏధి గయస్ఫానో గోభిరశ్వేభిరిందో। అజరాసస్తేసఖ్యేస్యామపితేవ పుత్రాన్ప్రతినోజుషస్వ॥ వాస్తోష్పతే శగ్మయాసంసదా తే సక్షీమహిరణ్వయా గాతుమత్యా। పాహిక్షేమ ఉత యోగే వరంనో యూయం పాతస్వస్తిభిస్సదానః॥ అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్, సఖాసు, శేవఏధినః) తతః పత్నీం వామతఉపవేశ్య తజ్జలేనైవ సర్వేమాహేశ్వరా స్త్రిమంత్రః సపల్లవ దూర్వాంకురాదిభిర్మంత్రపూర్వక మభిషించేయుః॥ అత్రమంత్రాః (సముద్రజ్యేష్ఠాస్సలిలస్య మధ్యాత్పునానాయ న్త్యనివిశమానాః। ఇంద్రోయావజ్రీ వృషభోరరాదతా ఆపోదేవీ రిహమామవంతు॥ యా అపో దివ్యఉతవాస్రవంతి, ఖనిత్రిమా ఉతవాయా స్స్వయంజాః। సముద్రార్థాయాశ్శుభయః పావకా స్త ఆపోదేవీ రిహమామవంతు॥ యాసాం రాజావరుణో యాతిమధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం మధుశ్చుతశ్శుచయో యాః పావకాస్తా ఆపోదేవీ రిహమామవంతు। యాసు రాజావరుణో యాసుసోమో విశ్వేదేవాయాసూర్జం మదంతి। వైశ్వానరో యాస్వగ్నిః ప్రవిష్టస్తా! ఆపోదేవీ! రిహమామవంతు! త్రాయంతా మిహ దేవాస్త్రాయతాం మరుతాంగణాః। త్రాయతాం విశ్వాభూతాని, యథాయమరపా అసత్ ఆపఇద్వాఉభేషజీరాపో అమీవచాతనీః। ఆపస్సర్వస్య భేషజీస్తాస్తే కృణ్వంతుభేషజం॥ హస్తాభ్యాం, దశశాఖాభ్యాం జిహ్వావాచః

---

గ్రహించి, "వాస్తోష్పతే... సఖాసుశేవ ఏధినః" అనిచెప్పుచు నొక్కొక ధారచేతనే పాత్రలయందు విడిచేని. ఆ దేజలము చే మాహేశ్వరులు "సముద్ర... భూర్భువస్స్వరోమ వృతాభిషేకోఽస్తు" అని యజమానునకు ఆయనపత్నికిని ప్రోక్షించి

పురోగవీ। అనామయిత్నుభ్యాం, త్వాతాభ్యాం, త్వోపస్పృశామసి ఇమా ఆపశ్శివతమా ఇమా స్సర్వస్య భేషజీః ఇమా రాష్ట్రస్య వర్ధనీ రిమా రాష్ట్రభృతో౽మృతాః యాభిరింద్రమభ్యషించత్ప్రజాపతిస్సోమం రాజానం వరుణం యమం మనుం తాభిరద్భిరభిషించామి త్వామహం రాజ్ఞాం త్వమధిరాజో భవేహ మహాంతం త్వా మహీనాం సమ్రాజం చర్షణీనాం దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్॥ దేవస్య త్వా సవితుః ప్రసవే౽శ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామగ్నేస్తేజసా సూర్యస్య వర్చసేంద్రస్యేంద్రియేణాభిషించామి॥ (బలాయ శ్రియై యశసే౽న్నాద్యాయ భూర్భువస్సువరో మమృతాభిషేకో౽స్తు) తతో యజమానస్సర్వేభ్యో మాహేశ్వరేభ్యో దక్షిణాం దత్వా (శన్నో దేవా విశ్వదేవా భవంతు శం సరస్వతీ సహ ధీభిరస్తు। శమభిషాచశ్శము రాతిషాచశ్శం నో దివ్యాః పార్థివాశ్శం నో అప్యాః। శం నస్సత్యస్య పతయో భవంతు శం నో అర్వంతశ్శము సంతు గావః। శం న్న ఋభవస్సుకృతస్సుహస్తాశ్శం నో భవంతు పితరో హవేషు॥ శం నో అజ ఏకపాద్దేవో అస్తు శం నో౽హిర్బుధ్న్యశ్శం సముద్రః। శం నో అపాం నపాత్పేరురస్తు శం నః పృశ్నిర్భవతు దేవగోపా॥ ఆదిత్యా రుద్రా వసవో జుషంతేదం బ్రహ్మ క్రియమాణం నవీయః। శృణ్వంతు నో దివ్యాః పార్థివాసో గోజాతా ఉత యే యజ్ఞియాసః॥ యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానాం మనోర్యజత్రా అమృతా ఋతజ్ఞాః। తే నో రాసంతామురుగాయమద్య యూయం పాత స్వస్తిభిస్సదా నః) ప్రాచ్యాం దిశి దేవా ఋత్విజో మార్జయంతాం దక్షిణస్యాం దిశి మాసాః పితరో మార్జయంతాం ప్రతీచ్యాం దిశి గృహాః పశవో మార్జయంతాం ఉదీచ్యాం దిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయంతాం ఊర్ధ్వాయాం దిశి యజ్ఞస్సంవత్సరో యజ్ఞపతిర్మార్జయంతాం। అమీవహా వాస్తోష్పతే విశ్వా రూపాణ్యావిశన్ సఖా సుశేవ ఏధి నః॥ ఇతి మంత్రైస్సర్వత్ర తజ్జలేనాభ్యుక్ష్య శుభం శుభం స్వస్తిపుణ్యాహ సమృద్ధిరస్తు. తతో మాహేశ్వరేభ్యో

పిదప మాహేశ్వరులకు దక్షిణనిచ్చి "శన్నో దేవా... ఏధినః" అని పుణ్యాహోదకమును ఇంటియొక్క భాగములయందు ప్రోక్షించి మాహేశ్వరులు వినోక్తముగా

వేదోక్త మంత్రాశిషోగృహీత్వా తైర్మాహేశ్వరై ర్దత్తాక్షత పుష్పాదికంశిరసి ధారయేత్॥ (ఇతి పుణ్యాహావాచనం)

# అథ నాందీసమారాధనం

తండులపూరితపాత్రే ఫలంనిధాయ చతుర్వింశతి మాహేశ్వరారాధనపరిమితం హిరణ్యాం దద్యాత్॥ తద్యథా॥ దేశకాలౌ సంకీర్త్యా అస్యాంశుభతిథౌ శ్శ్వఃకరిష్యమాణ వివాహాంగభూత నాందీశోభనదేవతాప్రీత్యర్థం నాందీసమారాధనం కరిష్యే. ఇతిసంకల్ప్య శ్రీనంది భృంగిరిటి వీరక వీరభద్ర పుష్పదంత అండాభరణ దండపాణి చండేశ్వర దారుక రేణుక వికర్ణ విజయకర్ణ ఘంటాకర్ణ రేణుకకర్ణ గోకర్ణ రేవణసిద్ధ మరుళసిద్ధ ఏకోరామ పండితారాధ్య సుకేతు రురు ఉపమన్యు భృగు దధీచి గౌతమాది ప్రమథగణాన్ పురాతనభక్త మహాగణా నత్రావాహయామి॥ నంద్యాదిమహాగణా స్సాయుధా స్సశక్తయస్సపరివారా స్సమాగత్యాత్రపూజాం భవంతో గృహ్ణాంతు. ఇతి ప్రజ్ఞాప్య వస్త్రద్వయ మాచ్ఛాద్య నంద్యాదిప్రమథగణేభ్యోనమః. ధ్యాయామి ధ్యానంసమర్పయామి. ఇత్యాది అష్టవిధార్చనం కుర్యాత్. హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః అనంతపుణ్యఫలద మతశ్శాంతింప్రయచ్ఛమే॥ అనేన హిరణ్యేన నాందీశోభనదేవతాస్సుప్రీతా స్సుప్రసన్నా వరదాభవంతు. ఇతి చతుర్వింశతి మాహేశ్వరాణాం దద్యాత్. తత శ్చతుర్వింశతిమాహేశ్వ రారాధనం కుర్యాత్॥

ఇతినాందీవిధానం.

---

ఆశీర్వాదములనుజేసి, మంత్రాక్షతలను యిచ్చెది. యజమానుడు ఆమంత్రాక్షతపుష్పములను గ్రహించి శిరస్సునందు ధరించుకొనునది.

## నాందీ సమారాధనము.

కర్త యొక తబుకనందు బియ్యమును నింపియుంచి వానిలో కాయలు పండ్లు మొదలగువానినుంచి ౨౪ రు, అ, కా, లనైకాని శక్త్యనుసారముగాబెట్టి పిదప సంకల్పమును జేసి 'శ్రీనంది... ఆవాహయామి' అని ఆవాహించి నంద్యాది ప్రమథగణేభ్యోనమః" అని చెప్పుచు, అష్టవిధార్చనచేసి, పైనజెప్పినధనమును "హిరణ్య... ప్రీయతాం" అని ౨౪ జన వీరమాహేశ్వరులకు పంచునది.

# అథ అంకురార్పణ విధిః.

దేశకాలావనుకీర్త్య అముకనామ్న్యాః కన్యాయాః అముకనామ్నో వరస్యచ వివాహకర్మాకతుం మాదౌ తత్కర్మసాఫల్య శుచిత్వ సిద్ధిద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం అంకురార్పణం కరిష్యే॥ ఇతిసంకల్ప్య శుద్ధస్థలం గోమయేనోపలిప్య రంగవల్ల్యాదిభి రలంకృత్య శ్వేతాక్షతై స్సంప్రకీర్య తత్ర శ్వేతతంతువేష్టితాః సువర్ణ రజత తామ్ర మృణ్మయాన్యతమాః పంచపాలికా స్సంస్థాప్య పాలికామూలే దూర్వాంకుర అశ్వత్థ శిరీషబిల్వాదీనిచ నిక్షిప్య, తాసుపాలికాసు వల్మీకమృత్తికాం హ్రదపంకం శుష్కగోమయంచ ప్రక్షిప్య పంచపాలికాసు బ్రహ్మాదిపంచదేవతాపూజాం కుర్యాత్. తత్రాయంక్రమః బ్రహ్మజజ్ఞాన మిత్యస్యసకులో బ్రహ్మ త్రిష్టుప్ (బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీమత స్సురుచోవేన ఆవః సబుధ్న్యా ఉపమా అస్యవిష్ఠాః స్సతశ్చ యోనిమసతశ్చవివః) ఇతి మధ్యమపాలికాయాం బ్రహ్మాణమావాహ్య పూజయేత్॥ ఇంద్రంవో మధుచ్ఛంద ఇన్ద్రో గాయత్రీ (ఇంద్రంవో విశ్వతస్పరి హవామహేజనేభ్యః అస్మాకమస్తు కేవలః) ఇతిప్రాచ్యాం పాలికాయామింద్రమావాహ్య పూజయేత్॥ యమాయసోమం యమో నుమో౽నుష్టుప్) యమాయసోమం సునుతయమాయ జుహుతాహవిః యమం హయజ్ఞోగచ్ఛత్యగ్నిదూతో అరంకృతః) ఇతిదక్షిణ

---

## అంకురార్పణము.

కర్తృవు యథాపత్తుగా సంకల్పమొనర్చి భూమినలికి రంగవల్లిని వేసి శుభ్రమగు బియ్యమునుపరచి తెల్లదారముచే చుట్టబడిన బంగారు వెండి రాగి మన్ను వీనిలో దేనివియైననూ ౫ పాత్రలను పెట్టేది. పాత్రలయొక్క క్రింద రావి దిర్సన మారేడు మొదలగు చెట్లచిగురుటాకులను వేసేది. పిమ్మట పుట్టమన్ను వాగునందుండు మన్ను ఎండిన గోమయము వీనిచే పాత్రలను నింపేది. ఆమీద 'బ్రహ్మజజ్ఞానం...మివః' అని ఉచ్చరించుచు మధ్యపాత్రలో బ్రహ్మనావాహించి పూజించేది. అనంతరము "ఇంద్ర...కేవలః" అని చెప్పుచు తూర్పునందు పాత్రయందు ఇంద్రునావాహించి పూజించవలయును. పిదప "యమాయ...అరంకృతః" అని చెప్పుచుదక్షిణదిశనుండు పాత్రయందు యముని నావాహించి పూజించవలయును. అటుపైన "తత్వా...ప్రమోషీః" అని పశ్చిమమందుండు పాత్రలో వరుణు నావాహించి పూజించేది.

స్యాం పాలికాయాం యమమావాహ్య పూజయేత్॥ తత్వాయామీ
త్యస్య శునశ్శేఫో వరుణస్త్రిష్టుప్. తత్వాయామి బ్రహ్మణావందమా
నస్తదాశాస్తే యజమానో హవిర్భిః అహేళమానో వరుణేహ బోధ్యురు
శగ్ం సమాన ఆయుః ప్రమోషీః) ఇతి ప్రతీచ్యాం పాలికాయాం వరుణ
మావాహ్య పూజయేత్॥ సోమో ధేనుమిత్యస్య గోతమస్సోమః
త్రిష్టుప్ (సోమో ధేనుం సోమో అర్వన్తమాశుం సోమో వీరం
కర్మణ్యం దదాతి। సాదన్యం విదథ్యం సభేయం పితృశ్రవణం యో దదా
శదస్మై) ఇతి ఉదీచ్యాం పాలికాయాం చంద్రమావాహ్య పూ
జయేత్॥ ఇత్యావాహనాద్యుపచారైస్సమ్యగభ్యర్చ్య (దిశాం
పత్నీర్నమస్యామి, సర్వకామఫలప్రదాన్। కుర్వన్తు సఫలంకర్మ కు
ర్వన్తు సతతం శుభం) ఇతి పాలికానాం పశ్చాద్భాగే ప్రాఙ్ముఖస్తిష్ఠన్,
ఉపస్థానం కుర్యాత్॥ తతో వ్రీహి, ముద్గ, చణక, తిల, గోధూమ,
పంచధాన్యాని తోయేన ప్రక్షాళ్య, బ్రహ్మజజ్ఞానేతి పూర్వమంత్రే
ణైవ మధ్యమపాలికాయామావాపయేత్॥ యతఇన్ద్రేత్యస్య ప్రగాథ
ఇన్ద్రో బృహతీ (యతఇన్ద్ర భయామహే, తతో నో అభయం కృధి
మఘవ ఞ్ఛగ్ధి తవతన్న ఊతిభిర్విద్విషో విమృధో జహి) ఇతి ప్రా
చ్యాం పాలికాయాం మావాపయేత్॥ నాకే సుపర్ణమిత్యస్య భార్గ
వో వేనో యమస్త్రిష్టుప్) నాకే సుపర్ణముపయత్పతంతం హృదా వే
నంతో అభ్యచక్షత త్వా। హిరణ్యపక్షం వరుణస్య దూతం యమ
స్య యోనౌ శకునం భురణ్యం) ఇతి దక్షిణస్యాం పాలికాయా మావాప

“సోమోధేనుం...దస్మై” అనిచెప్పుచు ఉత్తరదిశయందుండు పాత్రయందు చంద్రునావాహించి షోడశోపచారముల బూజించేది. పిదప “దిశాం...శుభం” అని చెప్పుచు పాత్రల పశ్చిమభాగమందు నిలబడి జపించునది. అపైన వడ్లు, పెసలు, శనగలు, నూవులు, గోధుములు- ఈ ౫ ధాన్యములను నీటిచే కడిగి బ్రహ్మజజ్ఞాన అను మంత్రముచే మధ్యపాత్రయందు కొన్నిటిని చల్లవలయును. ‘యతఇంద్ర...జహి’ అని చెప్పి పూర్వదిశ పాత్రయందు చల్లేది. “నాకే...భురణ్యం” అని దక్షిణదిశ పాత్ర యందు చల్లవలయును. ‘తత్వాయామి’...యనుమంత్రముచే పశ్చిమదిశపాత్రయందు చల్లేది. “సోమోధేను”...అను మంత్రమున ఉత్తరదిశయందుగల పాత్రలో చల్లేది. “ఆపోహిష్ఠా” యనుమంత్రముచే నీళ్ళను జల్లి పుష్పములచే నలంకరింపవలయును.

